మీరు విజ్ఞాన క్షేత్రంలో కృషిచేసి పరిశోధించి పండించిన ఒక వ్యాసానికి విశ్వవిద్యాలయంవారు డాక్టరేట్ ఇచ్చుట సరస్వతిని గౌరవించడమే. మీ ప్రతిభకు గౌరవం లభించింది. మీ వంటి పండితుల వలన భీమవరం ప్రతిష్ఠ మరింత పెరిగింది. అపరాత్పరుడు మీకు ఆయురారోగ్యాలను సాహితీ సంపత్తిని ఇవ్వాలని కోరుచున్నాను.

*'అభినవ భోజ' గన్నాబత్తుల పెదతాత*
అధ్యక్షులు : రామరాజభూషణ సాహిత్య పరిషత్, భీమవరం

మీరు భీమవరం సాహిత్య సభలలో పాల్గొని రంజింప చేయటం చూసాను. అలాగే మీరు ఇది వరకు వ్రాసిన గ్రంథాలు చదివి ఆనందించాను. ఇప్పుడు పి.హెచ్.డి. డిగ్రీ పొందాలంటే మరింత సంతోషంగా ఉంది. మీకు వేంకటేశ్వరస్వామి ఆయురారోగ్యములిచ్చుగాక! అని ప్రార్థిస్తున్నాను

*బొండా నాగేశ్వరరావు*
అధ్యక్షులు : కళా ప్రవంతి, భీమవరం

మీకు పి. హెచ్. డి. వచ్చినందుకు ఎంతగానో ఆనందించాను. తెలివైనవారు వచ్చిన అవకాశాన్ని వినియోగించుకుంటారే తప్ప వాటికోసం ఎదురు చూసి ప్రాకులాడరు. అదేవిధంగా మీరు అవకాశాన్ని వినియోగించుకొని స్వయం శక్తితో Ph. D. సాధించారు. అభినందనలు.

*తటవర్తి వెంకట రత్నం* (ముత్తాత)
Ex. Treasurer : D. N. R. College Associotion,
భీమవరం.

తాళ్ళపాక చిన్నన్నను గురించి పరిశోధించిన అన్నన్నా- తెలుగు జాతికి మీ పరిశోధన ద్వారా అమూల్యమైన కానుక నందించారు. పరిశోధనా ప్రభాకరులు కావాలని ఆకాంక్ష. మీ అభ్యుదయం మాకు ఆనందం.

*చెఱుకువాడ వెంకట్రామయ్య*
విస్సాకోడేరు.



శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారు సంప్రదాయ సిద్ధులు, సాహితీ మర్మజ్ఞులు. భావయిత్రీ కారయిత్రీ శక్తులు రెండును కలవారు. వారి ప్రతిభకు వారి అన్నవిజ్ఞానం, విశ్వనాథ శబరి గ్రంథాలు నిదర్శనాలు. వారు జన్మసంబంధంచేత, విద్యాసంబంధంచేత కూడ ఉత్తమమైన కోవకు చెందిన వారు. వారి వంశం పండిత వంశం. ఎం. ఏ. పట్టాతో తృప్తి పడక సాహిత్య పరిశ్రమ చేసి ఎన్నో గ్రంథాలు ప్రచురించి ఎన్నో సన్మానాలు పొందారు. అధ్యాపకునిగా ప్రవృత్తి కల్గి ఉత్తమ ఉపాధ్యాయులుగా ప్రభుత్వంచే ప్రశంసల నందినవారు. మేధ, హృదయం—రెండు కలిసి పనిచేస్తేగాని అవగాహన గాని విషయాలను వారు అవగాహన చేసుకొన్న మనీషి. వారి జీవితంలో సాహిత్యం – ఆధ్యాత్మికత పెనవేసుకొని ఉండటంచేత వారి విమర్శకు అటువంటి విషయాన్నే తీసుకొని సిద్ధినొందినవారు. పరమార్థం అధ్యయనం బోధనం మాత్రమే కాదు ఆచరణ ప్రచారాలు ఉంటేనే దానికి శోభయని నిరూపించిన ఉత్తమోపన్యాసకులు. వారి విమర్శనా పటిమకు నికషంగా ప్రస్తుతం చిన్నన్న ద్విపద సాహిత్యంపై ఒరపిడి పెడుతున్నారు. రసిక భావుకలోకం చవిచూచి, ఆనందింతురుగాక !

— ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్
**శ్రీ భాష్యం అప్పలాచార్యులు**
**విశాఖపట్టణం**